

# How to Prepare Catechumens

FOR

## HOLY BAPTISM.

## బాప్తిస్మమునకు సిద్ధపడేవారికి నేర్పవలసిన పాఠములు.

*For use in the Diocese of Dornakal.*



వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ. 1918.

బి. కే. స్వామి, ప్రింటర్.

# పీఠిక.

విగ్రహములను విడిచిపెట్టి, క్రీస్తుమతములో చేరి, బాప్తిస్మమును కోరువారిని సిద్ధపరచువారికి సహాయముగా ఈచిన్నపుస్తకము వ్రాయబడినది.

1. అట్టివారికి ముఖ్యముగా నేర్పవలసినదేమనగా:-

ప్రభువైన యేసుక్రీస్తును ఎరిగి, ఆయనను ప్రేమించునట్లు చేయవలెను. దీనికొరకు ప్రభువైన యేసుక్రీస్తుచరిత్రను చెప్పవలెను. ఆయన పుట్టుక, అద్భుతములు, మాత్రముగాక ఆయన మరణశ్రమలు, పునరుత్థానము, ఆరోహణము, రెండవరాకడ, మొదలైనవాటినిగూడ స్పష్టముగా చెప్పవలెను. "దేవునిప్రేమ ఇదిగో" అను కీర్తనబట్టి దీనిని నేర్పవచ్చును.

దిగువన ఆకీర్తనబట్టి ప్రభువుచరిత్రలో నేర్పవలసినసంగతులు చెప్పబడినవి.

2. మతముకోరువారు నేర్చుకొనవలసిన రెండవది ఏమనగా: ప్రభువైన యేసుక్రీస్తుద్వారా, దేవునిని, తమకుకావలసినవాటి నన్నిటికొరకు అడుగుటకును, వారు హిందూమతములోనుండినపుడు ప్రతిపనియందు విగ్రహములను ఏలాగు పూజించుచుండిరో, ఆలాగే యేసుక్రీస్తుద్వారా, యెహోవాయైన దేవునినితలంచి వేడుకొనుటకు అభ్యసించునట్లు నేర్పవలెను. దీనికొరకు ప్రభుప్రార్థన కంఠపాఠముగా నేర్పక తమస్వంతమాటలతో, రహస్యమైన స్థలములలోగాని, అడవిలోగాని, ఎక్కడనైనను, ఎప్పుడైనను దేవునిప్రార్థించుటకు నేర్పవలెను. ఈవిషయము రెండవపాఠములో చెప్పబడినది.

3. బాప్తిస్మముపొందబోవువారు అపోస్తలుల విశ్వాససూత్రమును ఒప్పుకొనవలసినది గనుక, ఆవిశ్వాససూత్రమును కంఠపాఠ

ముగా నేర్పుట యుక్తము. అయినను ప్రతిఅంశమును గ్రహించుకొనునట్లు విశదపరచవలెను. ప్రతిదినము జనులు విశ్వాససూత్రమును సేవకునివెంట చెప్పుటవల్ల కంఠపాఠము నేర్చుకొనవచ్చును. జనులకు విశ్వాససూత్రమును బాగుగా నేర్పులాగున ముప్పదినాలుగుపాఠములు ఏర్పరచబడియున్నవి.

4. బాప్తిస్మముపొందబోవువారు ప్రార్థనపుస్తకములోని క్రమము గ్రహించుకొనవలసినది. ఆక్రమముప్రకారము సంఘము ఏమి చేయును, గురువు ఏమిచేయును, బాప్తిస్మముపొందువారు ఏమిచేయవలసినదియు విశదముగా చెప్పవలెను. వారి తెలివికి తగినట్లు క్రమముగా నేర్పుటకు నాలుగవ భాగములో ఏర్పరచబడియున్నది.

ఉ పరి. మత్తయి.11: 28.

దీనిని కంఠపాఠముచేయనేర్పవలెను.

5. సతులైనపురుషులైనన్ - యాకర్త - సర్వజనులయెడలను.
స్త్రేమగనడిచెను - పరలోక - సద్బోధలిక జేసెను.

ఆయన స్త్రీపురుషులయెడల ప్రేమనుచూపించెను.

ఉ. పరి. లూకా. 7:11-17; 4: 40-41;
పరి. మార్కు. 10: 13-16.

6. చావునొందినకొందరిన్ - యేసుంపు - చక్కగాబ్రతికించెను-
సకలవ్యాధులరోగులు . ప్రభునంటి - స్వస్థంబుతామొందిరి.

ఆయనచేసిన అద్భుతము లు:—

(1) చచ్చినవారినిలేపుట . పరి. లూకా.7:11-17; 5: 22-24.
పరి. మార్కు. 5: 35-43.
పరి. యోహాను. 11: 32-44.

(2) రోగులను బాగుచేసెను.

ఉ. జ్వరము. పరి. మార్కు. 1:29-31.
కుష్ఠరోగము. పరి. మార్కు 1:40-44.
చెవిటినత్తివానిని. పరి. మార్కు.7.31-37.
దయ్యము. పరి. మార్కు. 5:1-20.

7. గాలిసముద్రపుపొంగులన్ - సద్దణిపి - నీళ్ళపైనడిచినాడే-
మేలుగలయద్భుతములు - ఈలాగు - వేలకొలదిగ జేసెను.

(3) తుఫాను ఆపివేసెను. పరి. మార్కు. 4: 35-41.
నీళ్ళపై నడిచెను. పరి. మార్కు. 6: 47-51

8. చేతులనుకాళ్ళలోను - రారాజు - చేరమేకులుబొందెను-
పాతకులుగొట్టినారే - పరిశుద్ధ - నీతితామోర్వలేకన్.

ఈరక్షకుని శిలువమీదవేయుటకొప్పగించిరి.

పరి. మార్కు. 15: 6-15.

9. ఒడలురక్తముగారగ - దెబ్బలు - చెడుగులందరుగొట్టిరి-
వడిముళ్లతలమీదను - బెట్టిరి - ఓర్చెనురక్షకుండు.

క్రీస్తుపొందినబాధలను వివరించుము. పరి. మార్కు. 15:16-20.

10. ఇన్నిబాధలుబెట్టుచు - దనుజింపు - చున్నపాపపునరులను.
మన్నించుమనితండ్రిని - యేసుండు - సన్నుతితో వేడెను.

ఆయన శిలువమీదచేసినప్రార్థన. పరి. లూక. 23: 32-34.

11. రక్షకుడుశ్రమబొందగా - దేశంబు - తత్క్షణముచీకటయ్యెన్.
రక్షకుడుమృతినొందగ - తెరచినిగె - రాతికొండలు బగిలెను.

ఆయన శిలువమీదనున్నప్పుడు జరిగిన విషయములు.
పరి. మత్తయి. 27: 45-54.

12. రాతిసమాధిలోను - రక్షకుని - నీతిగలదేహంబును
పాతిపెట్టిరిభక్తులు - నమ్మిన - నాతులందరుజూడగ.

ప్రభువుదేహముపాతిపెట్టబడుట. పరి. మత్తయి. 27:55-61.

13. మూడవదినమందున - యేసునాడు - మృతిగెల్చి లేచినాడే
నాడునమ్మినమనుజులు - జూచిరి - నలువదిదినములాదున్.

ప్రభువు పునరుద్ధానము. అపో. 1: 3.

14. పదునొకండుమారులు - నారలకు - ప్రత్యక్షమయ్యె యేసు
పరలోకమున కేగెను - తనవార్త - ప్రకటించుమనిపల్కెను.

(1) మగ్దలేనేమరియకు పరి. మార్కు. 16: 9.
(2) తక్కినస్త్రీలకు పరి. మత్తయి. 28: 9-10.
(3) ప. పేతురుకు 1 కొరింథ. 15: 5.
(4) ఇమ్మాయికు వెళ్ళినశిష్యులు పరి. లూకా. 24:13-35
(5) పదిమందిఅపోస్తలులకు పరి. యోహాను. 20:19-23
(6) పదునొకండుఅపోస్తలులకు పరి. యోహాను.
20: 26-29.

(7) గలిలయ్య సముద్రతీరమున 7గురు అపొస్తులులకు
పరి. యోహాను. 21: 1-24.

(8) ఐదు వేలమందికి 1 కొరింథీ.15: 7.

(9) ప. యాకోబుకు 1 కొరింథీ. 15: 7.

(10) ఆరోహణమైనప్పుడు పరి. లూకా. 24: 50-51.

(11) ప. పౌలుకు అపో. 9: 1-9.

15. నమ్మిస్నానముబొందెడి - నరులకు - రక్షణమరికల్గును
నమ్మనొల్లకపోయిన - నరులకు - నరకంబుసిద్ధమనెను.

సువార్త ప్రకటనఆజ్ఞ. పరి. మత్తయి. 28:18-20.
పరి. మార్కు. 16: 15-16.

---

# II ప్రార్థన.

ప్రభువుప్రార్థనను కంఠపాఠముగా నేర్పక జనులు స్వయముగా ఎప్పుడును ప్రార్థించుటకు అభ్యసించవలెను. ప్రార్థన అనగా దేవుని అడుగుట దేవునికి చెప్పుట.

## 1 ఎక్కడ?

1. అంతరంగ స్థలములో: అనగా,
   అడవిలో
   చెట్లక్రింద
   చీకటిలో
   గదిలో

2. ఇద్దరు ముగ్గురు కూడియున్నప్పుడు: అనగా,
   ఒకకుటుంబపువారు,
   కలిసిపనిచేసేవారు,
   పెనిమిటి, భార్య,

3. సంఘములో:—అనగా
   ప్రభుదినమున
   ఆదివారమున

## 2 ఎప్పుడు?

ఎల్లప్పుడును ప్రార్థన చేయవచ్చును. అనగా,
లేచునప్పుడు
పండుకొనునప్పుడు

అన్నముతినునప్పుడు
ప్రయాణముచేయునప్పుడు
క్రొత్తపని ఆరంభించునప్పుడు
నారునాటుటకుముందు
కోతకుముందు
క్రొత్తబట్టకట్టునప్పుడు
క్రొత్తయిల్లు కట్టినప్పుడు
పునాదివేయునప్పుడు
మహూర్త స్తంభము నాటునప్పుడు
దున్నుటకు ఆరంభించునప్పుడు
రూపాయిలు చేతికిదొరికినప్పుడు
పేరుపెట్టునప్పుడు
ఉదయమున
మధ్యాహ్నమున
సాయంకాలమున
రాత్రిసమయమందు
గుడికి పోవునప్పుడు
గుడిలోనున్నప్పుడు
గుడిలోనుంచివెళ్ళునప్పుడు..

## 3 ఏలాగు!

సంఘముగా కూడియున్నప్పుడు మోకరించి

అంతరంగముగ ఒంటరిగా నున్నప్పుడు మోకరించియైనను, కూర్చుండియైనను ఇతరసమయములలో యేలాగున్నప్పటికిని అలాగే అనగా కూర్చుండియైనను, నడిచియైనను, పండుకొనియైనను ప్రార్థన చేయవచ్చును.

భక్తి వినయపూర్వకముగా నుండుటమేలు.

# 4 దేనికొరకు?

1. శరీర అవశ్యములకొరకు ప్రార్థించవలెను.

ఆహారముకొరకు
పనికొరకు
బట్టలకొరకు
వానకొరకు
పంటకొరకు
కష్టములు నివృత్తియగుటకొరకు
కుటుంబముకొరకు
బిడ్డలకొరకు
బంధువులకొరకు
చల్లని కాపురముకొరకు
పిల్లలవివాహములకొరకు
చదువుకొరకు
సెలవికొరకు
రోగములు కుదుర్చబడుటకొరకు
ఇన్నిటికొరకును ప్రార్థించవచ్చును.

2. పాపక్షమకొరకు ప్రార్థించవలెను.

ఆయాదినములయందు చేసిన పాపములను స్పష్టముగా నొప్పుకొని పాపక్షమను వేడగనేర్చవలెను.

ఉ: ఇంటిలో జరిగిన జగడములు
పొలములో యొకరి బూతుమాటలు
దొంగతనములు

3. పాపములనుంచి తప్పించబడుటకు ప్రార్థన చేయవలెను

పైనఉదహరించిన పాపములను ఇకముందెట్లు చేయకుండవలెనని కోరి అభ్యసించవలెను. దీనికి పరిశుద్ధాత్మ సహాయమును అనుదినము ను కోరవలెను.

4. ఇతరులరక్షణకొరకును ప్రార్థనచేయవలెను.

అన్యులైన బంధువులకొరకు
అన్యులైన వూరువారికొరకు
ఇతరకులస్థులకొరకు
ఈహిందూదేశముకొరకు
హిందువులు మహమ్మదీయులందరికొరకు
క్రైస్తవులకొరకు
క్రొత్తసభవారికొరకు
పంతుళ్ళకొరకు
గురువులకొరకు
మిషనెరీలకొరకు
అధ్యక్షులవారికొరకు

వీరిలో యిష్టమైనవారిపేర్లుచెప్పి ప్రార్థించుటకు బోధించవలెను.

# III విశ్వాససూత్రము.

## 1 తండ్రి.

1. దేవుడు ఒకడుఉన్నాడు.

దేవుడు లేని జాతివారైనను, దేశస్థులైనను లేరు.

ఉ. హిందువులు, మహమ్మదీయులు, లంబాడీలు, కోయలు, అయినను దేవుడుఒకడే.

2. ఆయన పరలోకమును సృష్టించినవాడు

వెలుగు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాదులు. ఆది. 1: 1-19

3. ఆయన భూలోకమును సృష్టించినవాడు.

జంతువులు, చెట్లు, మనుష్యులు ఆది 1: 20-21

4. ఆయనసర్వశక్తిగలవాడు-

ఉ. అబ్రహాము చరిత్రనుంచి

ఇశ్రాయేలువారు ఎఱ్ఱసముద్రముగుండా నడిపించబడడం.

5. ఆయనమనతండ్రి.

ఉ. తప్పిపోయినకుమారుడు

6. ఆయనను మనము నమ్మవలెను

ఉ. అబ్రహాముచరిత్రనుంచి

## 2 కుమారుడు.

7. యేసుక్రీస్తును నమ్మవలెను

అపో 16: 31 కంఠపాఠము చేయవలెను

8. ఆయనదేవునిఒకడే కుమారుడు: అనగాదేవునిని తెల్పువాడు
ప. మార్కు 9: 7

9. ఆయనమనప్రభువు అనగా మనలను ఏలేవాడు
ప. మార్కు 9: 7

10. ఆయనపేరు యేసుక్రీస్తు.
యేసు = రక్షకుడు = క్రీస్తు = అభిషిక్తుడు = రాజు

11. ఆయనపరిశుద్ధాత్మవల్ల కన్యమరియ గర్భమందుధరింపబడెను
ప. లూకా 1: 26-28 చదివిచెప్పవలెను.

12. ఆయన ఆమెకుపుట్టెను.
ప. లూకా 2: 4-16 చదివి, చరిత్రచెప్పవలెను

13. పొంతి పిలాతు అధికారముక్రింద బాధపడెను
ప. మార్కు 15: 1-20 చదివిచెప్పవలెను

14. ఆయన శిలువవేయబడెను
ప. లూకా 23: 32-45

15. ఆయన చనిపోయి, పాతిపెట్టబడి అదృశ్యలోకములోనికి దిగెను. ప. లూకా 23: 46-54

16. ఆయన మూడవనాడు చనిపోయినవారిలోనుండి తిరిగి లేచెను
ప. యోహాను 20: 1-14

17. ,, దర్శనములు:—1 కొరింథ 15: 3-8

18. ఆయన పరలోకమున కెక్కెను
అపో 1: 6-11

19. సర్వశక్తిగల తండ్రియైన దేవుని కుడిచేతివైపున ఆయనకూర్చుండియున్నాడు.

20. ,, తనజనులకొరకు ప్రార్థించుటకు హెబ్రీ 7: 25

21. ,, తనశత్రువులను లోపఱచుటకు 1 కొరి 15: 25

22. అక్కడనుండి ఆయన తిరిగివచ్చును.
పదిమందికన్యలు ప. మత్తయి 25: 1-13

23. బ్రతికియున్న వారిని చనిపోయినవారిని విమర్శించుటకు అయన వచ్చును. ప. మత్తయి 25: 31-46

౫. పరిశుద్ధాత్మ.

24. పరిశుద్ధాత్మ ఉన్నాడు.
,, ఆయనవల్ల ప్రభుప్పుట్టెను.
,, ఆయనవల్ల మనముపుట్టితేనేగాని పాపక్షమ దొరకదు. ప. యోహా. 3: 5.

25. ,, బాప్తిస్మమందు ఈపుట్టుక దొరికెను తీతు 3:5.
,, బాప్తిస్మమునకు మారుమనస్సు కావలెను. అపో. 2: 38.
బాప్తిస్మమునకు విశ్వాసము కావలెను. అపో. 16: 31.
,, పరిశుద్ధియు చేసేవాడు ఆయనే.

26. ,, ఆయన సభలో నివసించుచున్నాడు. 1కొరి.3:16.
మనలను పరిశుద్ధపరచవలసినవాడు ఆయనే.

27. ,, అన్ని మంచివరములను దయచేసేవాడు ఆయనే.
ఆయనకొఱకు మనము ప్రార్థనచేయవలెను.
ప. లూకా. 11; 13.

28. సభ ఒకటే ఉన్నది.
దాని ద్వారము బాప్తిస్మము.

29. అది కాతోలిక సభ.

అన్ని స్థలములలోను, అన్ని కాలములలోను; అన్ని దేశములలోను, అన్ని జాతులవారికిని సభ ఒకటే.

30. అది పరిశుద్ధసభ.

అది పరిశుద్ధాత్మనివసించుచున్న సభ. 1కొరి.3:16

అది పరిశుద్ధమైయుండవలసిన సభ. 1కొరి.3:17

31. పరిశుద్ధులు ఒక్క శరీరమై యున్నారు.
1 కొరి 12: 27.

వారిసహవాసము దేవునితోను, ప్రభువుతోను, పరిశుద్ధాత్మతోను, పరిశుద్ధులతోను ఉన్నది.

32. సభలోచేరినవారికి పాపక్షమ ఈలోకములో నున్నప్పుడే దొరకును. 1 యోహాను. 1: 9.

33. శరీరపునరుత్థానమున్నది.
1 కొరి. 35: 42.

౩౪. నిత్యజీవమున్నది.

పరి యోహాను. 5: 24.

# IV బాప్తిస్మము.

1. బాప్తిస్మమందు పునర్జన్మము దొరకును. తీతు 3: 5; పరియోహాను 3: 5.

2. బాప్తిస్మమందు పరిశుద్ధాత్మ హృదయములోనికివచ్చును. అపొ 2: 38.

3. బాప్తిస్మమందు పాపక్షమదొరకును అపొ 22: 16.

4. బాప్తిస్మమందు దేవునిసభలో అవయవముగా చేయబడుదురు. 1 కొరి. 12: 27.

బాప్తిస్మక్రమముయొక్క భాగములు:--

1. పై ఆశీర్వాదములు దొరికేలాగున బాప్తిస్మసమయములో సంఘపువారును గురువును ప్రార్థనచేయుదురు.

2. దీనివిషయమై దేవుడనుగ్రహించియున్న వాగ్దానములను వినిపించుదురు.

3. తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మపేరట నీళ్ళలోముంచి లేక దానికి గుర్తుగా నీళ్ళను పోసి సిలువగుర్తువేయుదురు

4. అంతకుముందు బాప్తిస్మము కోరేవారు మూడుప్రమాణములుచేసేలాగున అడుగుదురు; అవి యేవనగా :

i పాతకాలములో చేసిన పాపములను విడిచిపెట్టుచున్నావా?

ii క్రీస్తుమతసత్యములను నమ్ముచున్నావా?

iii నీజీవితకాలమంతయు క్రీస్తుమత యేర్పాటులచొప్పున నడుచుకొందువా?

I విడిచిపెట్టవలసినపాపములు మూడువిధములైనవి.

(1) సాతానును వానిక్రియలన్నిటిని రోసివేయవలెను అనగా

రాళ్లు రప్పలకు మ్రొక్కుట
దేవర్లకుపెట్టుట
దయ్యములకు అర్పించుట
ఎఱుక చెప్పుట
ఎఱుక అడుగుట
హనుమంతునిబిళ్ళలువేయుట
బొట్టుపెట్టుట
బొమ్మలకుపెట్టిన అన్నముతినుట, అనగా నైవేద్యము తినుట
మంత్రములుచెప్పించుకొనుట
కొబ్బరికాయలు అర్పించుట
పశువులనుపూజించుట

(2) లోకముయొక్క వృధాడంభమును ఘనమును లోకసంబంధమైన దురాశలనన్నిటిని రోసివేయవలెను.

అనగా అన్యులపండుగచూచుట
పీర్లపండుగ వేడుకచూచుట
నాటకములుచూచుట
కులమునుబట్టి గర్వము
జాతినిబట్టి గర్వము
ధనగర్వము
స్థితిగర్వము
ధనాపేక్ష
అన్యులవిందును ఆశించుట
అన్యులపెండ్లికిపోవుట
అన్యపెండ్లిచేయుట

(3) శరీరేచ్ఛలను రోసివేయవలెను
వ్యభిచారము
వరసతప్పిన పెండ్లి
క్రైస్తవఆచారములకు వ్యతిరిక్తమైన పెండ్లి
కల్లు, సారాయి త్రాగుట

II క్రీస్తుమతసత్యములను నమ్మవలెను.

III ఇకమీదట ప్రాణమున్నంతకాలము క్రీస్తుమతాచారములతో తప్పక నడుచుకొనుటకు ప్రయత్నము చేయవలెను.

పది ఆజ్ఞలు.

1. నీదేవుడనైన యెహోవాను నేనే నేనుతప్ప వేరొకదేవుడు నీకుండకూడదు.
2. విగ్రహములను పూజింపకూడదు.
3. దేవునినామమును ఊరకనే పలుకకూడదు.
4. దేవుని ఆరాధనకొరకు వారములో ఒకదినమును ప్రతిష్ఠించవలెను.
5. తలిదండ్రులను సన్మానించవలెను.
6. నరహత్యచేయకూడదు.
7. వ్యభిచరింపకూడదు.
8. దొంగిలకూడదు.
9. అబద్ధపుమాటలు పలుకకూడదు.
10. చెడ్డఆశలు తలంపులు వుంచుకొనకూడదు.

## కెటిక్యుమెనులకొరకు ప్రార్థన.

---

ఓ ప్రభువా, ఈదేశములో [ముఖ్యముగా ఈమిషన్‌లో] బాప్తిస్మముకొరకు నేర్పుపొందుచున్నవారందరిమీద మతినుంచుము; వారిని కరుణించి, విశ్వాసమందు స్థిరపరుచుము; వారు నీయాజ్ఞయందు పూర్ణభక్తి నిలిపి తాము నేర్పుపొందుచున్న నీవాక్యమునందు స్థిరమైన తెలివిలో పెరుగునట్లును, వారి పాపక్షమాపణకొరకు పునర్జన్మమను స్నానముద్వారా పరిశుద్ధాత్మయొక్క నివాసముకొరకు యోగ్యులుగా చేయబడునట్లును, వారి హృదయములనుంచి విగ్రహారాధన మూఢభక్తి బొత్తిగా తీసివేయుము. మా ప్రభువైన యేసుక్రీస్తుద్వారానే వేడుకొనుచున్నాము. ఆమేన్.

---

